# ఆశయములు

"వైదిక ధర్మ గ్రంథమండలి"

వరలినదండీ ! వరలిందీ !!

అజ్ఞానంబును బోద్రోలంగ
అంధులందరిని మేలుకొలుపగ
వేద ధర్మముల విదజల్లంగ
సోదరాంధ్రులకు శుభము లొసగగ॥ వై॥
శారీరిక, ఆత్మిక, సామాజిక
దారుణమగు వ్యాధుల బోకార్చగ
ఆర్య ఋషుల గౌరవము నిలుపగ
ఆర్యజీవితాదర్శము దెలుపగ॥ వై॥
దొంగ గురువుల దోపిడీగాండ్ర
భంగును ద్రావెడి పరబ్రహ్మములు
పొంగుచు దిరిగెడి టక్కుటమారుల
సంగతి సమగ్రముగ దెలుపంగ॥ వై॥
ఆర్యసమాజపు గ్రంథములెల్లను
ఆంధ్రులు శమితో జదువుకొనంగను
ఆంధ్రభాషలో అనువదింపగ
అహర్నిశంబులు కృషిసలుపంగ॥ వై॥
[illegible] ప్రతులలో పల
[illegible] గంథములు గాగల్గినోయని
[illegible] తపాలఖర్చు భరించుచు
కోరినవారల కందజేయగ॥ వై॥

# మేనము ఆర్యసమాజీయులము

# ఎందుకు కా[illegible]?

'వైదికధర్మ గ్రంథమండలి

( స్థాపితము బహుధాన్య )

ఈ. ౧౯౩౮

శా. ౧౮౬౦


అనువాదకులు

నందూరి కృష్ణమాచార్యులుగారు, బి. ఏ.



ప్రకాశకులు

మంత్రిప్రగడ వెంకటేశ్వరరావు

ప్రతులు ౧౦౦౦

వృష నం॥ర వైశాఖ

వెల మూడు అణాలు

గోలకొండ ముద్రాక్షరశాల

హైదరాబాదు - దక్కన్

# ఆంధ్రులారా!

## అజ్ఞానాంధకారమునుండి, బయటబడి, శారీరక-ఆత్మిక సామాజికోన్నతిని బడయదలచినచో?

## ?

# 'వైదికధర్మ గ్రంథమండలి'

పక్షమున వెలువడు గ్రంథములను తప్పక

చదువుడు.

౩౬౦ పుటలలో కాగల గ్రంథములకు సాధారణ

సభ్యుల చందా

౧—౪—౦ మాత్రమే.

వివరములకు:

మంత్రిప్రగడ వెంకటేశ్వరరావు,

ప్రకాశకుడు,

“వైదికధర్మ గ్రంథమండలి”

దేవిదీన్ బాగు, సుల్తాన్ బజారు, హైదరాబాదు-ద.

# మహారాజ పోషకులు

మహారాజశ్రీ దోమలపల్లి నరహరిరావుగారు

జమీందారు, కాకులకొండాపురము

# రాజ పోషకులు.

మ. రా. శ్రీ. గోదబాలకిషన్ ఆర్యగారు (బొల్లారం)

,, ఆర్. కె. వాసుదేవ మొదలియార్ గారు (సికింద్రాబాదు)

,, యం నారాయణరావుగారు వకీలుగారు

మహబూబునగరము

# పోషకులు

మ. రా. శ్రీ. రాజా వెంకటభూమారెడ్డిగారు (అక్మూర్)

,, యామజాల రాఘవరెడ్డిగారు [నారాయణగూడ]

,, డాక్టరు ముత్యాల దొరస్వామినాయుడుగారు

హిమాయత్ నగర్

,, బేలెలక్ష్మయ్యగారు [అబ్దుల్లారిసాలా]

,, మద్దివెంకటనారాయణరెడ్డిగారు [సిరివేలు]

,, పులుసాని వెంకటపుల్లారెడ్డిగారు, హాయాత్ నగరు

,, పులుసాని రాంరెడ్డిగారు (హాయాత్ నగర్)

,, రాజా ఆలా వెంకటప్రతాపరెడ్డిగారు

వానాజిపేట

# సహాయకులు

శ్రీ) ఆర్యసమాజము శికింద్రాబాదు,

మ. రా. శ్రీ. కేతిరెడ్డి హనుమంతరెడ్డిగారు చాటపల్లి

,, ఇభరాంపట్నం రాఘవాచారిగారు సుల్తాన్ బజారు

,, సోముసోమేశ్వరరావుగుప్తగారు సుల్తాన్ బజారు

,, కె. బాబురావు యాదవగారు ఇస్లామియా బజారు
,, నర్సింగ ప్రసాదుగారు ఖమ్మంమెట్టు
,, కొమరవెల్లి నర్సయ్యగారు మంథెన
,, లోకేచిన రామన్నగారు ముఖ్తెదారు, మంథెన
,, చీటీ వెంకటనర్సింహారావుగారు దేశముఖు
పెట్టుపల్లి
,, బి. శాయిరెడ్డిగారు మొసర,
,, వరకాంతం గోపాల్ రెడ్డిగారు వకీలు లింగంపల్లి,
,, ఆలా గోవిందరెడ్డిగారు దుబ్బాక,
,, కె. గోపాలస్వామి పిళ్ళైడాక్టరుగారు అఫ్జల్ గంజ్,
,, వెంకటనారాయణరెడ్డిగారుముఖ్తెదారు.
నందిగ్రామం,
,, కె. వెంకటరెడ్డి వకీలుగారు, పాటిపల్లి
,, పెద్ది నరసయ్యగారు, హైదరాబాదు
,, సి. ఆర్: రామకృష్ణారెడ్డి వర్మగారు,
డాక్టరు, బొల్లారం
,, జి. గంగారెడ్డి ముస్తాజర్ గారు, మంచిర్యాల
,, ఆంజనేయస్వామివారు, రాచాల
,, మాదిరెడ్డి రామారెడ్డిగారు, కంట్రాక్టరు
నారాయణగూడ
ఆర్యసమాజము, నిజామాబాదు
,, వెదిరె రంగారెడ్డిగారు, కొంపల్లి
,, శీలం అల్యాలరెడ్డిగారు, పోతేపల్లి
,, తిప్పర్తి నారాయణరెడ్డిగారు, తెనుగుపల్లి
,, సుతరావె నాగేంద్రరావుగారు, నల్లగొండ
,, జె. వెంకటాద్రి గుప్తగారు వకీల్, నల్లగొండ

ఓం

# తొలిపలుకు

---

ఆర్యసమాజ ప్రచారక సందర్భమున అనేక మందికి అనేకసంశయము లుత్పన్నమగుచుండుట చూచుచున్నాము. అట్టి వారు ఆర్యసమాజముయొక్క సాహిత్యమును చక్కగా పరిశీలించక, సిద్ధాంతములను సరిగా గ్రహించకపోవుటవలననే ఇట్టిసంశయములకు లోనగుచున్నారుకాని వేరుగాదు. అందువలన 'ఆర్యసమాజము'ని పేరువినినంత మాత్రముననే నానావిధ విరుద్ధప్రచారము సాగించుచు 'మేమార్యసమాజీయుల మెందుకుకావలయున'ను మొదలగు ప్రశ్నలవేయ మొదలిడుచున్నారు.

ఈవిషయమునుగురించి తగు సమాధాన మేమియావలయునా యని నేనాలోచించుచుండ యింతలో శ్రీయుత పండిత అవధ్ బిహారిలాల్ ఎం.ఏ. ఎల్.ఎల్.బి. గారు రచియించిన హిందీగ్రంథము "హం ఆర్యసమాజీ క్యోంబనే"? యనుపేరుగలది నాకు లభించెను. దానిని చదివిన తదుపరి, ఆర్యసమాజమును గురించి సంశయించు ఆంధ్ర సోదరీ సోదరులకు ఈ

గ్రంథము తృప్తికరముగా నుండగలదని తోచి దీనిని ఆంధ్రమున అనువదించుటకు నామిత్రులగు శ్రీయుత నందూరికృష్ణమాచార్యులవారిని కోరితిని. అంత వారు నాకోర్కెనుస్వీకరించి త్వరలో ఆంధ్రమున ననువదించి యిచ్చిరి. అందుకు వారికి నా కృతజ్ఞతావందనము లర్పించుచు, సోదరాంధ్రులీ గ్రంథమును తప్పక జదివి—"ఆర్యసమాజము"పైనగల తమ సంశయముల నివారించుకొన ప్రార్థితులు.

ఇట్లు
మంత్రిప్రగడ వేంకటేశ్వరరావు,
ప్రకాశకుడు.



ఓం

# పవిత్రవేదాదేశము.

---

"ఓం ఇన్ద్రం వర్ధన్తో అప్తురః
కృణ్వన్తో విశ్వమార్యమ్
అపఘ్నన్తో అరావ్ణః"

ఋ ౯-౬౩-౫

జ్ఞాన, తేజస్సంపన్నులగు విద్వాంసులు, ఈశ్వర ప్రతిష్ఠను, సంసారమున వృద్ధి జేయుచు, స్వార్థము, పాపము, అను వానిని నశింపజేసి,సర్వజగత్తును (శ్రేష్ఠాచార సంపన్నముగా) ఆర్యులుగా చేయువలెను.

# వి ష య సూ చి క.

# మనము ఆర్యసమాజీయుల మెందుకు కావలెను!

౧

## మేము ఆర్యులముకాము - హిందువులము.

ఆర్యసమాజమనేది క్రొత్తది రాకపోతే హిందువులమని
చెప్పుకోకుండా ఆర్యసమాజము వారమని ఎందులకు
చెప్పుకోవాలని చాలమంది అడుగుతారు. అట్టివారికి
సమాధానరూపంగా యిక్కడ హిందూ-ఆర్య శబ్దముల
విషయమై కొంచము వ్రాయుట అవసర మనిపిస్తుంది. ఎవ్వరైతే
తాము హిందువులమని చెప్పుకొనుచు, ఆర్యశబ్దమన్ననే ఉపే
క్షను అసహ్యమును ప్రకటించుచు, ఆర్యులను అల్లరి పెట్టుటకు
వారిని అరియాలని పిలుచుదురో అట్టివారు గొప్ప పొరపాటుగా
వించు చున్నారు. తమ దుర్దశనుగుర్తెరుంగక-దానినే మహా
దానందపదవిగ భావించు కొనుచున్నారు. ఈ దేశముయొక్క
పేరు "ఆర్యావర్త" మన్నమాట పూజాపునశ్చరణ సందర్భము
లలో చెప్పుసంకల్పములలో నిత్యము చెప్పబడుచునేయున్నది.
ఈదేశ నివాసులపేరు ఆర్యులగుటవల్లనే దేశమునకు ఆర్యులు
తిరిగిన దేశముగాన ఆర్యావర్తమని పేరువచ్చింది. సుప్రసిద్ధ భాష్య
కారుడగు కుల్లూకభట్టు మనుస్మృతిలో ఆర్యావర్తశబ్దమునకు

యీ క్రిందవిధముగా టీకగావించెను. "యస్మిన్ - ర్యాఃఆవర్తన్తే పునః పునరుద్భవన్తి యిత్యార్యావర్తః అనగా ఎక్కడకు ఆర్యులు మరల మరల వచ్చుచుందురో, పుట్టుచుందురో ఆ దేశము ఆర్యావర్తము. హిందువులయొక్క సుప్రసిద్ధపుణ్యక్షేత్ర మగు కాశీలోని విశ్వనాథ దేవాలయముయొక్క ద్వారబంధ ముమీద ఆర్యులుతప్ప అన్యులు గుడిలోనికి రాకూడదని చెక్క బడియున్నది. దానిలో హిందూ శబ్దములేదని చదువుకున్న యాత్రికులు తప్పక చూసి ఉంటారు. వేదములైతే మాత్రం ఆర్యులు కానివారందరికి దస్యులని పేరు పెట్టినవి. "విజా నీహ్యార్యాన్యేచదస్యవః" (ఋ-౧-౫౧-౮) అనగా ఆర్యులు కాని వారిని దస్యులని తెలుసుకొనుము. వాల్మీకి రామాయణములో రాముని ఆర్యునిగా చెప్పెను.

సర్వదాభిగతః సద్భిః సముద్ర యివసింధుభిః
ఆర్యః సర్వసమశ్చైవ సదైవ ప్రియదర్శనః॥.

నదులు సముద్రమునెట్లు కొలుచునో అట్లే సత్పురుషు లచే రాముడు కొలువబడుచుండును రాముడు సమదర్శి, సుందరుడు, ఆర్యుడు. ఆ ప్రకారమే దశరథుని విషయము రాముడు సుమిత్రతో నిట్లు చెప్పెను.

అదృష్ట దుఃఖం రాజానం వృద్ధమార్యం జితేంద్రియం
బ్రూయాస్త్వమభి వాద్యైవమమ హేతోరిదంవచః

అయోధ్యా

అర్థము-ఎప్పుడు దుఃఖమునుచూడనట్టి జితేంద్రియుడును, వృద్ధుడును ఆర్యుడునగు రాజుతో నా పక్షమున యీ మాట

చెప్పెను. ఇట్లేవందలకొలది ప్రమాణముల చూపించవచ్చును. ప్రాచీనసంస్కృత గ్రంథములలో దేనియందైనను 'హిందూ' శబ్దము ప్రయోగింపబడినట్లు కనబడదు. 'ఆర్య' శబ్దమే ఉపయోగింపబడినది.

వ్యాకరణశాస్త్ర ప్రకారము 'ఋ' ధాతువునకు 'ణ్యత్' ప్రత్యయము చేర్చుటవల్ల 'ఆర్య' శబ్దము ఏర్పడుచున్నది. వ్యుత్పత్తి ననుసరించి యీపదమునకు జ్ఞానవంతుడనియు, జ్ఞానముట్టిపడు ఆచరణ గలవాడనియు, అభీష్టసిద్ధి గలవాడనియు, నలుగురు పరిచయము చేసికొనుటకు, సేవించుటకు తగినవాడనియు అర్థము. ఒక విద్వాంసుడు యీపదమున కర్థము నీక్రింది విధముగా చెప్పెను.

కర్తవ్య మాచరన్ కర్మాకర్తవ్య మనాచరన్
తిష్ఠతి ప్రకృతాచారే సవై ఆర్యఇతిస్మృతః॥

అర్థము:—కర్తవ్యమును నిర్వహించుచు సదాచారములందే నిమగ్నుడై యుండువాడే ఆర్యుడు.

వైదికనిఘంటువగు నిరుక్తమందు ఆర్యః ఈశ్వర పుత్రః అనగా ఆర్యుడు ఈశ్వరునిపుత్రుడని చెప్పబడినది.

హిందూశబ్దము పారసీభాషలోనిది. ప్రాచీన నిఘంటువందేనియందు కనపడదు, ఫారసీ నిఘంటువులలో యీశబ్దమునకు చోరుడు, బందిపోటుదొంగ, గులాము, కాఫిరు, నల్లవాడు మున్నగునర్థము లీయబడినవి. ఆ అర్థములలోనే ఫారసీకవులు హిందూశబ్దము నుపయోగించిరి.

ఉదాహరణ. అగర్ ఆంతుర్కె శీరజీ వదస్త్ ఆంరా దిలేమారా
వఖాలే హిందు అశ్వఖ్మమ్ సమర్ కందో బుఖారారా॥

అర్థము:—శీరాజ్ యొక్క ఆతురుష్కుడు నా హృదయ మును వశపరచినయెడల నేనాతని నల్ల (హిందు) శరీరమునకు సమరకంద్ బుఖారాలను యిచ్చెదను.

దో హిందుయే అజ్ పస్ సంగ్ సర్ వరావర్ దంద్. గులిస్తాఁ

అర్థము:—ఇద్దరు బందిపోటుదొంగలు (హిందు) ఒక రాతి వెనుకనుండివచ్చిరి.

ఈవిషయములో నింకను ఉదాహరణల కోరువారు పండిత్ లేఖిరాంగారు వ్రాసిన "ఆర్య హిందూ నమస్తేకాఅను సంధాఁ" అను గ్రంథమును చూడకోరెదను. విధర్మ్యులు ద్వేష ప్రేరితులై మనకు హిందువులని పేరెట్టినారు. హిందూశబ్దపక్ష పాతులు భాషాతత్వశాస్త్రాభిమానులు ఫారసీభాషలోని చెడు అర్థములు ఆశబ్దమునకు చెందవనియు, అది సంస్కృతమునుండి వచ్చినదనియు చెప్పెదరు. కొందరు హిందూశబ్దము సింధూ శబ్దముయొక్క అపభ్రంశమని చెప్పెదరు. మాటల వంచి విరిచి, చంపి కావలసిన అర్థము లాగుటకు ప్రతివారికి అధికార ముగలదు. సంస్కృతభాష కామధేనువు వంటిది. 'మియా' శబ్దమునకుకూడ సంస్కృత వ్యుత్పత్తి కొందరు చూపించినట్లు కూడ వినియున్నాము. అట్టి విద్వాంసులతో మేము వాదించ ము. కాని వారితో యీహిందూశబ్దాన్ని మన ఋషులు, ఆచార్యులు, గ్రంథకారులు సంస్కృత గ్రంథములలో నెక్కడ

ఉపయోగించలేదు కావున మనపేరుక్రింద ఎంతమాత్రం హిందూశబ్దాన్ని ఉపయోగించరాదు అనిమనవిచేసుకుంటాము.

దయానంద ఋషి మనయదార్థనామము మనకు తెలిపెను. మనము ఆమహానుభావుని ఉపకారమును మరచిపోక మనపేరు మార్చుకోవాలి. లేకపోతే శత్రువులు అవమానించుటకు ముఖమునకు మసిపూసితే దానినే గౌరవచిహ్నముగా నెంచి సంతోషించుచు యథార్థస్థితి తెల్పువారల తిట్టు మనుష్యునకును మనకును ఎంతమాత్రము భేదముండదు.

---

## ౨

## మేము ఆర్యులమే కాని ఆర్యసమాజికులము కాము

కొంతమంది ఆర్యసమాజమువారివల్ల 'ఆర్య' శబ్దము యొక్క వ్యాఖ్యానము విన్నతరువాత తామార్యులని చెప్పుకొనుటకు వెనుకాడరు. వారు హిందువులయొక్క యదార్థమైన పేరు 'ఆర్యులని' ఒప్పుకుంటాము కాని మేము ఆర్యసమాజికులము కామంటారు. మాకు సమాజముతో ఏమిసంబంధం? ఆర్యసమాజం దయానందస్వామి మనస్సునుండి పుట్టినది. మేము ఏవిధమైన సమాజములో తగుల్కొనటాని కిష్టపడమంటారు. అట్టివారికొరకు సమాజమంటే యేమిటి, దానియొక్క ఉపయోగము మున్నగునవి సంక్షేపముగా చెప్పుట అవసరము.

విద్వాంసులు మానవుని 'సమాజిక జీవము ని' వర్ణించిరి. దానిబట్టి సమాజము మనుష్యమాత్రుని కెంత ఆవశ్యకమైనదో, లేక అనివార్యమైనదో తెలుస్తుంది, సమాజము లేకుంటే మనుష్యునిజీవితము చాల నీరసముగాను ఆనందహీనముగాను ఉంటుంది. అందువల్లనే ప్రపంచములోని శిక్షాపద్ధతులలో కెల్ల యావజ్జీవిత ద్వీపాంతరవాసశిక్ష ఘోరమైనదని అందరు ఒప్పుకొందురు. జైలులో ఖైదీ ఏదైనా పెద్దతప్పుచేసినప్పుడు ఏకాంతవాసశిక్ష విధించెదరు. తిరుగలితిప్పుట మున్నగుశిక్షలన్న భయపడనట్టి—కొరడా దెబ్బలన్న లక్ష్యపెట్టనట్టి ఉద్దండుడైన ఖైదీ కూడ ఏకాంతవాసశిక్ష యన్నంతనే దారికివచ్చును. ఇందులో ఏమి రహస్యమున్నదో విచారించితే సమాజముయొక్క మహిమవిదితముకాగలదు. ద్వీపాంతరవాసశిక్షలోను, ఏకాంతవాసశిక్ష విధింపబడినప్పుడు మనుష్యుడు తన సమాజమునుండి విడదీయబడును. అతనిదుఃఖమున కదేకారణము. అతనికట్టి దుఃఖము కల్గించుటకే అట్టిశిక్ష విధింపబడును.

ఒక్కడు ఉంటే మనుష్యుడు కంగారుపడుతాడన్న విషయమొక్కటే సమాజావసరానికి కారణం. సమాజం మనుష్యజాతియొక్క సభ్యతావికాసమునకుకూడ కారణము. ఏజాతియైన దానియొక్క సమాజము ఎంతవరకు సుసంఘటితముకాదో యంతవరకుపూర్తిగా ఉన్నతస్థితికి రాజాలదు. మనుష్యుడెప్పటికి తనకు కావలసినపనులన్ని తానే చేసుకొనుట సంభవముకాదు. లోకములో మనుష్యునకు ఎన్నివస్తువులవస

రమో వాటినన్నిటిని ఒక్కడే తనకుతాను చేసుకొనజాలడు. కొంచం ఆలోచించిచూడండి. ఒక్కమనుష్యుడెవ్వడైనా ప్రత్తి సి తనేపండించి దానిని దారముగాతీసి మగ్గముమున్నగు పరికరముల తయారుచేసుకొని ఆనూలునుబట్టగాచేసికొని సూది, దారముల మరలచేసుకొని చొక్కాలుగా కుట్టుకొని తనే సబ్బునుకూడ తయారుచేసుకొని ఆబట్టలను శుభ్రముగా ఉతుకుకొనగోరినచో బట్టలసమస్య తేల్చుకొనునప్పటికే వానిబ్రతుకు తెల్లవారును. పైగా నతనికికుర్చీలు, మేజులు, మంచాలు మున్నగునవి ఎన్నియో కావలసిఉండును. వీటినన్నిటిని సొంతముగా తయారుచేసుకొని జీవితముగడుపుట ఎవ్వనికైనా ఒక్కనికి సంభవమా? అట్టివ్యవధి లేనందువల్ల-జీవితానికతిముఖ్యమగు భోజనంకొరకు ఏర్పాటుచేసుకొనక పోవచ్చును. ఇతర అవసరముల విషయమై దృష్టిమరల్చుటకుకూడ నాతనికి అవకాశముండదు. అట్లు చేయగోరిన నాతడు జ్ఞానము, విద్య, నాగరికతమున్నగు వాటినుండి వంచితుడై పశుతుల్యుడై మనుష్యజన్మవల్ల సార్థకత బొందనేరడు. అందుకనియే పరమాత్మ సమాజవ్యవస్థ మనుష్యులకుచూపించి గుణకర్మ స్వభావానుసారముగ నాసమాజమును బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను చాతుర్వర్ణ్యములుగ భాగించెను. బ్రాహ్మణులు విద్యాజ్ఞానముల నార్జించువారు. తద్వారానే వారు యితరులసేవ చేయుచుందురు. రెండవవారగు క్షత్రియులు యితరుల రక్షణభారమును వహించెదరు. వ్యవసాయముమున్నగునవి గావించు వారగు వైశ్యులు

తమయొక్క యితరులయొక్క భోజనమునకు వలయు నేర్పా
టుల గావింప బాధ్యులు. చెప్పులు బాగాచేయగల వారు
వాటినే చేయునట్లుగను వారికి భోజనాదికముల నొసంగు
బాధ్యత నన్యులుగావించునట్లు ఏర్పాటుచేయబడెను. ఎవ్వరో
ఒకరే అందరిపట్టల నుతుకుదురు. ఇట్లు సరియగువ్యవస్థగావిం
చుటవల్ల ఎవ్వరో ఒక్కరిమీద అధికభారము పడకుండుటవల్ల
విద్య, కళ, విజ్ఞానములు యుక్తమగు ఉన్నతిగాంచి విశ్వకల్యా
ణమును సాధింపగలవు. సమాజమువల్లకలుగు రెండవలాభ
మిది. కొందరు 'మంచిది సమాజముయొక్క ఆవశ్యకత మాకు
తెలిసింది' హిందూసమాజము ఉండ నేడున్నదిగదా? నీవుచెప్పిన
లాభములన్ని దానివల్ల సమకూరవా? అటువంటప్పుడు మేము
ఆర్యసమాజికుల మెందులకు కావాలందురు. మీరు ఆర్యులమ
ని మొదటనే ఒప్పుకున్నారు. సమాజావశ్యకతకూడ నంగీకరిం
చారు. అందువల్ల మీరు ఆర్యసమాజికులైనారని ప్రత్యుత్తర
మిస్తాము. కొందరు కావలసినసంస్కరణముల హిందూసంఘము
లోనే చెయ్యమంటారు. సంస్కరణలుగావించ ప్రయత్న
ము ప్రచారము ఎవ్వరుచెయ్యవలెను? ఎవరిమట్టుకువారే వ్యక్తి
గతంగాకాక అట్టిభావాలుగల సంస్కర్తలందరు సంఘముగా
చేరిప్రచారముగావించితే బాగుండదాయని మామూలుప్రశ్న.
ఈప్రశ్నకు జవాబు అవునని కాని యింకొకటి ఉండజాలదు.
ఎవరికివారే యమునాతీరే యన్నట్లుండుటకంటె సుసంఘటిత
మైన సమాజముయొక్కటే లాభప్రదమని ఎల్లరంగీకరింతురు.
వేదములేమంటాయో చూడండి.

సమానోమంత్రః సమితిః సమానో సమానంమనః సహచిత్తమే షాం
సమానంమంత్ర మభిమంత్రయేవః సమానేన వోహవిషా జుహోమి॥

అర్థము: మీయందరిమనస్సులు ఏకమగుగాక. మీసభలో ఐక్యత ఉండుగాక. మీమనస్సు చిత్తముకలసి పనిచేయుగాక. నేను (ఈశ్వరుడు) మీలో కేవిధమైన భావములుండునట్లు చేయుదును. ఒకేవిధమగు అన్నోన్యపభోగముల నొసంగెదను.

ఒకేవిధమగు నభిప్రాయములుగలవారి సమాజము లేకపోయినచో మనుష్యుని సామాజికజీవితము ఎన్నటికిని సుఖకరము కాజాలదు. ఏసమాజములో మనుష్యులుందురో అక్కడ ఒకేవిధమగు భావాలుగల పురుషులుండకపోయినచో ఎవ్వడు కూడ తన సిద్ధాంతములప్రకారము నడువజాలడు. ఉదాహరణార్థం కన్యలకుపదహారేండ్లు నిండితేనేగాని వివాహంచేయరాదని సిద్ధాంతముగలమనుష్యుడు పదిసంవత్సరాలకంటె ఎక్కువ వయస్సుగల్గిన అవివాహితలగు కన్యల తల్లిదండ్రులు సోదరులు నరకానికి పోతారన్నవారితో నిండినసంఘంలో ఉంటే అతను తనకుమార్తెవివాహం తనసిద్ధాంతానుకూలంగా చేయగలడా? ఆర్యసమాజికులలో అధికసంఖ్యాకులు అంటరాని తనమున్నగు వేదవిరుద్ధములగు చెడుగులనుండి బయటపడ లేకపోవటానికిదే కారణం. ఈ అన్నికారణాలవల్ల ఆర్యసమాజ సిద్ధాంతముల పాలించువారందరిని ఒకసంఘంగా ఏర్పాటుచెయ్యాలని అనగా ఆర్యసమాజాన్ని బలవత్తరం చెయ్యాలని తేలుతుంది.

అన్నిటికంటె చిన్నవిషయం తనపేరే మార్చుకోలేనివాడు తది తర సంస్కరణాలనేమి ఆచరణలో పెట్టగలడు? చెడ్డపేరుంటే చెడ్డసంస్కారాలు నెత్తికెక్కుతాయన్న విషయం అందరూ ఒప్పుకున్నదే. ఒక్కొక్కశబ్దంలో విచిత్రమైన మంత్రశక్తి ఉం టుంది. ఆర్యశబ్ద ఉచ్చారణవల్ల ఆర్యఋషులయొక్క, మహాపు రుషులయొక్క దివ్యజీవితములు మనలో అపూర్వ ఉత్సాహము ను స్ఫూర్తిని గలిగించుతాయి. ప్రపంచమునంతను పాలించినట్టి, విద్యావిజ్ఞాన సదాచారములందు లోకగురువులైనట్టి ఆఆర్యుల జాతికి చెందినవారమన్న గర్వముచే మన శిరస్సులపై కెత్తి తిరుగగలము హిందూశబ్దమువల్ల మనకళ్లముందు నృత్యముచే యగల ఆదర్శమేముంది? మనల లజ్జపడచేయు హిందూశబ్దాన్ని మనపేరుగా ఉపయోగించుకుంటూ జీవితంలో మనంచేయకల్గింది ఏముంది? 'ఆర్య'నామమువల్ల ఆర్యావర్తమును పాలించవలసిన ఉత్తరదాయిత్వ సంబంధమైన ఆలోచనమనల ఉన్నతోన్నత స్థితికి తీసికొనిపోగలదు. అందువల్ల సంస్కర్త యితరుల సంస్క రించుటకు ప్రయత్నించుటకుముందు ముఖ్యాతిముఖ్యమైన సంస్కరణ తనపేరులో గావించుకొనవలెను. తానార్యసామా జికుడనని చెప్పుకోవలెను.

ఆర్యసమాజం చాలామంచి పనిచేస్తున్నది. మేముకూ డా ఆర్యసమాజికులమే. కాని మేము ఆర్యసమాజికులమని ఎందుకుచెప్పుకోవాలి? ఆర్యసమాజికులమంటే ప్రజలు బెదరిపో తారు. మమ్ము తమకంటె భిన్నులుగా భావించుతారు. మేము

చెప్పినది వినటానికిష్టపడరు. అందువల్ల వ్యర్థంగా మేము ఆర్య సమాజికులమని ఎందుకు చెప్పుకోవాలని కొందరు అంటారు. అట్టివారిసంఖ్య నానాటికి వృద్ధిచెందుచున్నట్లు కన్పడుతున్నది. వారి భావాలుమాత్రము ప్రశంసనీయమే కాని అందులో పొర పాటు ఒకటున్నది. వారు సత్యాన్ని దాస్తున్నారు. వారిమను స్సులో ఉన్నదిఒకటి, చెప్పేదిఒకటి, తరువాతచేసేదిఒకటి. అది సత్పురుషలక్షణం కాజాలదు. "మనస్యేకం వచస్యేకం కర్మ ణ్యేకం మహాత్మనాం" అనగా మహాత్ములు (మనోవాక్కాయ కర్మలందు) త్రికరణశుద్ధిగలవారు. లోకులు మామాట వినక పోతేపోనీ. కాని "సత్యమేవజయతేనానృతం సత్యేనపంథావిత తో దేవయానః" అనగా ఆఖరికి సత్యమేజయించును సత్యమే విద్వాంసులమార్గమును విస్తృతము (పెద్దది) గావించును అన్న మాటజ్ఞాపకముంచుకోవలెను. ఇదియేచలనములేని సిద్ధాంతము. ఈసిద్ధాంతమునే లోకమంతా ప్రతిఘటించినను స్వామి దయా నందసరస్వతివిడువనిది. దానివల్లనే నేడు ప్రపంచమంతాఆయన సిద్ధాంతములలోని సత్యాన్ని ఒప్పుకుంటున్నారు సారాంశము ఆర్యులను ఆర్యసమాజముల గురించియే 'సత్య' ప్రచారము గావించుట ఉచితం. సత్యముగ్రహించుటకును, అసత్యమును వదలుటకును ఎప్పుడూ సిద్ధముగా ఉండాలని ఆర్యసమాజము యొక్క నాలుగవనియమములో గలదు.

---

# 3

## మేము సనాతనధర్మాన్ని ఎందుకు వదలాలి?

మేముసనాతనధర్మాన్ని ఎందుకు వదలిపెట్టాలనిహిందువులు ప్రశ్న అడుగుతూవుంటారు. నిజంగా అదియుక్తియుక్తమైనప్రశ్నయే. ఎందుకంటె సనాతనధర్మంయొక్క మహిమసచ్ఛాస్త్రాలన్నిటిలో వర్ణింపబడింది. అట్టిధర్మాన్ని వదలుమని ఎవ్వరైనా చెప్పినట్లైతే అది చాల చెడ్డసంగతే. అట్టిమాటను ధర్మాన్నే ప్రాణంగాచూచుకొనే మనుష్యుడు పాటించరాదని మేముకూడా చెప్తాము.

ఆర్యసమాజం సనాతనధర్మాన్ని వదలిపెట్టమని చెప్తుందా యని విచారించవలెను. అట్టివిచారణ ప్రారంభించడానికిముందు సనాతనధర్మమంటే ఏమిటో తెలుసుకోవడం అవసరం. వ్యాకరణ శాస్త్రంప్రకారం సనాతనశబ్దవ్యుత్పత్తి "సదా భవః సనాతనః" అంటే ఎప్పుడూ ఉండునదని అర్థము. ధర్మం "ధృ" ధాతువునుండి పుట్టుచున్నది. దానికి అర్థం— ధారణచేయుట, లేకపోషించుట. దానివల్లనే మహాభారతంలో "ధారణాత్ ధర్మమిత్యాహుః "ధర్మోధారయతి ప్రజాః" అని చెప్పబడినది. దానికర్థం— ధారణ లేక పోషణ గావించుటవల్లనే ధర్మమని చెప్పబడుచున్నది. ధర్మం ప్రజల పోషించును. ఏది ఎప్పుడూ ఉండినదో దేనికి ఆదిలేదో -- దేనిని ఒప్పుకొని పాలించుటవల్ల మనుష్యునికి కల్యాణముకలుగునో అదియే సనాతనధర్మమని సిద్ధమైనది. ఆదిగల్గి కొద్దికాలంనుండి ఆచరణలోఉన్న

దానిని సనాతనధర్మ మనజాలరు. నేడు సనాతనమని దేనినం టున్నారు? సనాతనధర్మం ఏమిటని ప్రజలనడుగు తేపురాణాలలో వర్ణింపబడినదేనని చెప్పుతారు. ఆధునిక పరిశోధనలవల్ల పురాణాలుపుట్టినవని వేయిసంవత్సరాల కిటీవలనని నిశ్చయమైంది. పురాణాలప్రమాణాలుగా ఒప్పుకొనేపౌరాణికుల మాటప్రకార మైనా అవివ్యాసకృతం అవటంవల్ల అయిదువేల సంవత్సరాలకు పూర్వం పుట్టినవిమాత్రం కాజాలవు. పురాణాలకు పూర్వము షట్శాస్త్రములుగలవు. కాని అవికూడా సనాతనములుకావు.

వేదాంత ధర్మశాస్త్ర రచయితయగు వ్యాసమహార్షి మహాభారతపురోజుల్లో అనగా నేటికి అయిదువేలఏండ్లకుపూర్వము ఉండెను. మీమాంసకారుడగు జైమిని వ్యాసమహార్షి శిష్యుడవటంవల్ల ఆయనకు సమకాలికుడు. వారిద్దరికి పూర్వం కూడా వేదాలున్నాయని ఒప్పుకోవలసి ఉంటుంది. ప్రాచీన ఋషులు వేదాలు పరమాత్మయొక్క జ్ఞానమన్నారు. పరమాత్మ సనాతనుడగుటవల్ల ఆయనజ్ఞానమైన వేదాలుకూడా సనాతనములే. అందుకనియే మనుభగవానుడు "వేదోఖిలో ధర్మమూలం" అనగా వేదాలు సమస్తధర్మాలకు మూలమని చెప్పినాడు. అందువల్లనే ధర్మజిజ్ఞాసువులకు వేదాలనే పరమప్రమాణంగా చెప్పినాడు.

"ధర్మజిజ్ఞాస మానానాం ప్రమాణం పరమంశ్రుతిః" మను.

మనుభగవానుడు చెప్పిందెంతవరకు సత్యం? సామవేదంలోని బ్రాహ్మణమునందు "యద్వై మను దవదత్తద్ భైషజం

భైషజతాయా" అనగా మనువు చెప్పినది ఔషధులకెల్ల ఔషధంఅని చెప్పబడింది. ఒకస్మృతికారుడు:—"మన్వర్థ విపరీతాయాసా స్మృతిర్నైవశస్యతే" అంటే మనువు వ్రాసినదానికి విరుద్ధంగా ఉన్నస్మృతులు అంగీకరింపబడజాలవని చెప్పినాడు. మనువుప్రకారం సనాతనధర్మాన్ని ప్రతిపాదించునవి వేదాలే. వేదప్రామాణ్య విషయంలో హిందువులెవ్వరికీ సందేహం ఉండజాలదు. వేదోక్తధర్మప్రచారార్థమే ఆర్యసమాజ స్థాపకుడగు దయానందఋషి ప్రాణాలొడ్డినాడు. ఎవ్వరైనా నీధర్మమేమని అడుగుతే నాధర్మం వేదమని చెప్పమన్నాడు. "వేదమే సమస్తవిద్యలయొక్క పుస్తకం. వేదంచదువుట, చదివించుట, వినుట వినిపించుట ఆర్యులందరికి ధర్మం"అని ఆర్యసమాజముయొక్క మూడవ నియమంలో కలదు, వర్తమానకాలంలో స్వార్థపరుల, అజ్ఞానుల వేదవిరోధులయొక్క భావాకల్పితములగు మతవిశేషాలను, సనాతనధర్మంపేర జరుగు దురాచారాలను, ఆర్యసమాజం ఖండించుతుంది. జంకు, గొంకులు లేకుండా ఖండించగలదు. అట్టి చెడువిషయాలకు పెట్టిన "సనాతనధర్మం" అనేపేరు నేతిబీరకాయవంటిది. పుట్టుగ్రుడ్డివాడికి దృష్టిసౌఖ్యంలాంటిది. దరిద్రునకు ధనపతి అనేపేరులాంటిది. మూర్ఖునకు విద్యాధరుడనే పేరులాంటిది. మేము విద్యాధరుడనే మూర్ఖునియొక్క అవిద్యను ఖండించుతూ విద్యాధరుడు మూర్ఖుడంటే విద్వాంసులు మమ్మాక్షేపించుతారా? తమశత్రువుగాభావించుతారా? ఎన్నటికిఅట్లు అనకొనరు. అట్లే సనాతననామధారుల ఆర్యసమాజం

ఖండించితే-అది సనాతనధర్మ విరోధికాజాలదు. సనాతననామధారులు వేదవిరోధులగుటవల్ల మనువుప్రకారంచూస్తే నాస్తికులు 'నాస్తికో వేదనిందకః' అని మనువుచెప్పినాడు. ఆర్యసమాజం సనాతనధర్మాన్ని ప్రచారంచేసేది, పునరుద్ధరించేది. అదే సనాతనధర్మాన్ని వదలవలసిందని ఎప్పటికిచెప్పజాలదు.

---

## ౪

## మేము మా తండ్రి తాతల ధర్మాన్ని ఎందుకు వదలాలి?

ఏదైనా దురాచారాన్ని ఖండించితే అది మా తండ్రి తాతలనాటినుండి వస్తున్నది. దానిని మేము వదలిపెట్ట జాలమని, మాతండ్రి తాతలు మూర్ఖులాయని ధర్మాన్నే ప్రాణసమానంగా చూచుకునే హిందువు అంటాడు. ఇప్పుడు తండ్రి తాతల ఆచారాల మనం అనుసరించాలా? వద్దా? అన్నప్రశ్న బయలుదేరుతుంది. అనుకరించాలంటే ఎంతవరకు అనుకరించాలి? "అనువ్రతః పితుః పుత్రః" అనగా పుత్రుడు పితానుకూలమైన వ్రతంగలవాడుగా ఉండవలెను అని వేదంచెప్పుతుంది.

యేనాస్య పితరో యాతాః యేనయాతాః పితామహాః
తేతయాయాత్సతాం మార్గతత్ర గచ్ఛాన్నరిష్యతే.

మనువు ౪-౧౭౭

అను శ్లోకంలో తండ్రి తాతల నెంతవరకు అనుచరించవలసిందో స్పష్టంచేసినాడు. తండ్రి తాతల మార్గాన్ని సంతానం

అనుసరించ వలసిందే కాని ఆమార్గంమాత్రం సత్పురుషులు చరించే మార్గమైనప్పుడే. అది దుష్టమైనప్పుడు తప్పకుండా ఆ మార్గాన్ని సంతానం పరిత్యజించి నూతనమార్గావలంబులు కావాలి. పైనవ్రాసిన శ్రుతివాక్యానికికూడాయిదే తాత్పర్యం. ఆశ్రుతివాక్యం పుత్రుడు తండ్రియొక్క వ్రతానుగామి కావాలని చెప్పుతున్నది. వ్రతమనుమాటకు సత్కార్యమనే అర్థం. అసత్కర్మయని ఎంతమాత్రం అర్థంకాజాలదు. ఈవిషయాన్నే ఒకగురువు తన శిష్యులకు బోధించుచున్నట్లు తైత్తరీయోపనిషత్తునందుగలదు. స్వాభావికముగా పిల్లలు తల్లి దండ్రుల, గురువుల ననుకరించుచుందురు. ప్రపంచములో లోపములు లేని పరిపూర్ణులు ఎవ్వరులేరు. అట్టివేళ నాపిల్లలు తాముపెద్దలలోపములకూడ అనుకరించెదరేమోనని యీక్రిందివిధముగా ఆ గురువు శిష్యుల హెచ్చరించెను.

"యాన్యస్మాకం సుచరితాని తానిత్వయోపాస్యానినయితరాణి"

అనగా మా మాలోగల మంచినే అనుసరింపవలసింది. చెడుగులకాదు.

సాధారణబుద్ధితో విచారించిన యిదియే సరియైన పద్ధతిగా తేలుతుంది. ఒకవేళ తండ్రిదరిద్రుడై పుత్రుడు ధనవంతుడైతే ఆపుత్రుడు తన తండ్రియొక్క దారిద్ర్యమందలి గౌరవముచే తనధనాన్ని పారపోసుకుంటాడా?, తండ్రి గ్రుడ్డివాడైతే కొడుకు తానుకూడా గ్రుడ్డి కావాలని కండ్లు పోగొట్టుకొంటాడా? ఎవ్వరైనా తండ్రిననుసరించాలని జూదరిగాను, త్రాగు

బోతుగానూ అవటానికి అంగీకరించుతారా? ఎవ్వడుఅంగీకరించడు. తేలినసారాంశం తండ్రి తాతల ఆచరణను ధర్మాధర్మ దృష్టితో పరిశీలించి మంచి విషయాలనే గ్రహించాలని తేలుతుంది.

ఆర్యసమాజం ధర్మవిషయంలో విచారించటంలో బుద్ధికి ప్రాధాన్యత యిచ్చింది. వేదోపదేశం కూడాయింతే. బుద్ధిని సద్భావప్రేరితముగావించ మని పరమాత్ముని ప్రార్థించమని గాయిత్రీమంత్రంలో ఉపదేశంగలదు. మనువుకూడా తర్కానికి ఎక్కువస్థానమిచ్చును.

"యస్తర్కేణాను సంధత్తేసధర్మవేద మేతర."

మనువు

అర్థం:- తర్కాన్ని ఉపయోగించి ఎవ్వడు విచారించునో అతడే ధర్మాన్ని తెలుసుకోగలడు.

ఋషులు తర్కంశ్రేష్ఠమన్నారు. ప్రపంచములోని ఆధునిక విద్వాంసులుకూడా బుద్ధివాదానికి ఉచితస్థానమిచ్చేదే భవిష్యత్తున మతంగా ఉండగలదను నిశ్చయానికి వచ్చారు. బుద్ధికితగిన స్థానమిచ్చునట్టి మతంగాని ధర్మంగాని ప్రపంచములోలేదు. అందరుకూడా తాముచెప్పేదానిని గుడ్డిగానమ్మమంటారు. ఒక్కవైదికధర్మమే ప్రతివిషయంలోను బుద్ధిని ఉపయోగించి పరీక్షించి మంచిదైనదానినేఒప్పుకోమని చెడ్డదైతే వదలిపెట్టుమని బోధించుతుంది. అట్టివైదికధర్మాన్ని ఆర్యసమాజం ప్రచారం గావించుతుంది. అందువల్ల నేటివిజ్ఞానయు

గంలో ఆర్యసమాజమే ధర్మరక్షణగావించగలదు. ఈశ్వరుని, ధర్మాన్ని బహిష్కరించవలసిందని యూరోపులో పుట్టిన ప్రచండ ఝంఝుమారుత వేదప్రచారమే లేకపోతే మానవుని పరమేశ్వర పరాఙ్ముఖునిగని గావించివేస్తుంది.

చాలకాలంనుంచి వస్తున్నదన్న కారణంవల్ల ఏసంగతైనా మంచిదని చెప్పుట సరికాదు. ప్రాచీనమైనంతనే వస్తువుగాని, ఆచారంగాని మంచిదనుకొనటానికి తగిన ప్రమాణములేవియులేవు. ఏదైనాదురాచారం పాతదైతే దానిని సంస్కరించరాదనిగాని రూపుమాపకూడదనిగాని ఎవ్వరనజాలరు. ఎవరిపుత్రుడైనా చాలకాలంనుండి జబ్బుగా ఉంటే-అతనిజబ్బు చాలప్రాచీనమైనదగుటవల్ల దానిని నివారించుట పాపమని, దానిని నివారించమని సలహాచెప్పువారు ధర్మద్రోహులని, పాపులని ఎవ్వరైనా అంటారా?

అదేవిధంగా ఏదైనాదురాచారం వేదవిరుద్ధంగాను, బుద్ధికివిపరీతంగాను ఉంటేదానిని వదలిపెట్టి వైదికధర్మగ్రహణం కావించుట సనాతనధర్మానుకూలమైన కార్యమేనని చెప్పబడుతుంది.

తాతస్యకూపోయమితిబ్రువాణాః!
క్షారం జలంకాపురుషాః పిబన్తి!!

తండ్రి త్రవ్వించినాడన్న కారణంవల్ల ఉప్పునూతిలోని ఉప్పునీరు త్రాగువాడు కాపురుషుడు, నీచుడు. అట్లుచేయటం ధర్మసంగతమెంతమాత్రంకాదు.

## ౫

### స్వధర్మే నిధనం శ్రేయః! పరధర్మో భయావహః

తనధర్మంలో చనిపోవటం మంచిది. పరధర్మం భయావహమైందను గీతలోని పైశ్లోకార్థాన్ని చూపి చాలమంది పండితులు ఆర్యసమాజ ప్రచారాన్ని ఖండించుతారు. మనం ఏధర్మాన్ని యింతవరకు అవలంబించుతూ వచ్చామో దానిలోనే మనజీవితమంతా గడపటం ఉచితం. ఆర్యసమాజంవారు వేద ప్రతిపాదితమైనదని చెప్పే ధర్మాన్ని మేము అంగీకరించము. శ్రీకృష్ణభగవానుని వాక్యప్రకారం అట్లంగీకరించుట భయావహమైందని వారంటారు. ఈవిషయాన్ని గురించి పూర్తిగావిచారణసల్పుటవసరం. ధర్మంవిషయంలో శ్రీకృష్ణుడు గుడ్డినమ్మకం ఉండాలని ప్రచారం చేశాడా? బుద్ధిపూర్వకంగా విచారించి సత్యాన్ని గ్రహించి అసత్యాన్ని పరిగ్రహించాలనే సిద్ధాంతానికి శ్రీకృష్ణుడు ప్రతికూలుడా? ఈ రెండు విషయాలను తేల్చుకోటానికి మేము పైశ్లోకంలోని రెండుపాదాలను ఉదాహరించుతాము. పూర్తిశ్లోకం యీవిధంగాఉంది

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

[ గీతా 3-35 ]

పైశ్లోకం విషయం మేము ఏమీవ్రాయకుండా శ్రీలోకమాన్య బాలగంగాధర తిలకుగారు వ్రాసిన గీతారహస్యంనుండి వారువ్రాసిన వ్యాఖ్యానటిప్పణాల నిక్కడ ఎత్తివ్రాసెదము.

పరధర్మానుష్ఠానం సుఖకరంగా ఉన్నప్పటికి తనధర్మం అనగా చాతుర్వర్ణ్య విహిత కర్మయే ఒకవేళనది లోపభూయిష్టమైన ప్పటికి శ్రేయస్కరమైంది. స్వధర్మాను సారంపోతుంటే వచ్చే మృత్యువైనా మంచిదేగాని పరధర్మంభయంకరమైంది. స్వధర్మం అంటే స్మృతి కారులు చాతుర్వర్ణ్య వ్యవస్థానుకూలంగా ఒక్కొక్క మనుష్యునికి నియమించిన కర్మ. స్వధర్మంఅంటే మోక్షంకాదు. అందరికల్యాణముకొరకే గుణకర్మల మీదనాధారపరచి చాతుర్వర్ణ్యవ్యవస్థనుశాస్త్ర కారులు ఏర్పాటు చేసినారు. అటువంటప్పుడు బ్రహ్మక్షత్రియా దులు జ్ఞానులైన పిమ్మటకూడ తమతమ కార్యములందప్రమ త్తులై ఉండాలని శ్రీకృష్ణభగవానుడు చెప్పినాడు. అట్లుచేయుట లోనే సంఘానికి వారికి క్షేమంకలదు. ఊరికేగడబిడ గావిం చుటవల్ల లాభం ఉండదు, చాతుర్వర్ణ్యవ్యవస్థలేని చోటకూడ నీసిద్ధాంతంవల్లనే లాభంగలదు. తనజీవితాన్నంతా సైనికవ్యవ హారాల్లోగడపిన వ్యక్తి అవసరమైతే మరల సిపాయిగాపనిచేయ గలడు గాని దర్జీపనిచేయజాలడు. ఈన్యాయమే చాతుర్వర్ణ్యవ్య వస్థకుకూడా వర్తించును. ఇత్యాది

గీతారహస్యం పుట ౫౬౫-౫౬౬

వైశ్య శూద్రులయొక్క కర్మ వారియొక్క స్వాభావిక గుణములబట్టి విభక్తమైందని శ్రీకృష్ణుడు చెప్పెను. ౪౧ వ శ్లోకములో ప్రత్యేకగుణ కర్మస్వభావాదుల చూపించి అంద రు వారివారికి నియమింపబడిన కర్మలద్వారానే పరమాత్ముని

అర్చనచేసి సిద్ధిబడయవచ్చునని చెప్పెను. దానితరువాత ఈ శ్లోకం ఉంది.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావనియతంకర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం॥

పై శ్లోకములోని పూర్వార్థం- తృతీయాధ్యాయంలో ఉన్న 35 వశ్లోకంలో ఉన్నదే. ఉత్తరార్థంలో స్వధర్మమంటే స్వభావనియతం కర్మఅని శ్రీకృష్ణుడే నిర్వచించెను. శ్రీకృష్ణుడు ధార్మికసంస్కరణాలకు ప్రతికూలుడనిగాని కనీసం భగవద్గీతలో అట్లుఉన్నదనికాని చెప్పేవాదం నిర్మూలమని తేలిపోతుంది.

మతసంస్కరణకు ప్రతికూలురైనవారు ధర్మమని దీనిని భావించుతారే. అదిఒక్కటే. దీనిలో అనేకంలేవు. బృహదారణ్యక ఉపనిషత్తులో "యోవై సధర్మః సత్యం వైతత్" అనగా ధర్మం సత్యం ఒక్కటే. ఏవిధంగా వెలుతురువల్ల అంధకారం నశించిపోతుందో ఆదేవిధంగా జ్ఞానంఅనే వెలుతురువల్ల అసత్యపాషండ మతరూపములైన అంధకారమునశించిపోతుందని చెప్పబడింది. జ్ఞానాభివృద్ధితోపాటు సత్యధర్మముల స్వరూపంకూడా స్పష్టమౌతూ ఉంటుంది. అందువల్ల అసత్యాన్ని పట్టుకొనికూర్చోవటం మంచిదికాజాలదు. తెలిసీ తెలియనివారెవరో ధర్మంఅని చెప్పినదానినే ప్రజలు పట్టుకొని కూర్చోవటమే సరియైన మార్గమన్నమాటే, శ్రీకృష్ణుని సిద్ధాంతమైతే, తలపగలకొట్టుకొని అర్జునుడికి గీతల నెందుకు

ఉపదేశముచేస్తాడు? తాతల, పినతండ్రుల, సోదరుల మామల మున్నగు సన్నిహిత బంధువర్గాన్ని చంపజాలనని అస్త్ర సన్యాసంచేసిన అర్జునుడికి బోధించి స్వధర్మమైనయుద్ధం ఎందుకు చేయిస్తాడు? నేర్పితేనేగాని మనుష్యుడికి అక్షరాలు, మాటలు రానప్పుడు ధర్మప్రచారకుల, ఉపదేశకుల గురువుల బోధలేకుండా ధర్మమంటే యెట్లు తెలుస్తుంది? ధర్మం మున్నగు విద్యా సంబంధమైన విషయాలు విని తెలుసుకుంటేనేగాని ప్రాప్తము కావు. విద్వాంసులదగ్గరజేరి నేర్చుకుంటేనేగాని ఎరుకపడవు. అందుకనే దర్శనకారుడు,

"ఉపదేశ్యోప దేష్టత్వాత్ తత్సిద్ధిః ఇతరథా అంధ పరంపరా"

అనగా, విద్యా జ్ఞానములు మున్నగునవి మంచిగురువు నకు మంచిశిష్యుడు దొరికినప్పుడు బాగుగా సిద్ధించగలవు. లేకపోతే అజ్ఞానాంధకారము లన్నీ అలముకొనివుంటాయి- అని అన్నాడు.

అందువల్ల ధార్మికవిషయాలలో తన పాతనమ్మకాన్నే పట్టుకొని వ్రేలాడని బుద్ధి నుపయోగించకుండా ధర్మంపేర హృదయంలో గడ్డకట్టుకొని కూర్చొనియున్న కుసంస్కారాలను గుడ్డినమ్మకాలను వాటిమీదనే పూర్తి విశ్వాసం కలిగి ఉండటమే శ్రేయస్కరమని, బుద్ధిమంతులు, జ్ఞానవంతులు చెప్పే మంచిమాటల చచ్చినానసరే ఒప్పుకోకూడదని- ఆ గీతాశ్లోకానికి అర్థంచెప్పటం చాలా తెలివితక్కువపని.

రెండు పైసలుకుండ కొనటంలో మనం మోసపోతే భరించలేం. వీలైతే దానిని ఆరిగియిచ్చి మంచిదానిని తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తాము. రెండు మూడురోజులుండే కుండ కొరకే మనమింత జాగ్రత్తతీసుకొంటే యీజీవితానికే కాకుండా జన్మ జన్మాంతరాలకు సంబంధించిన విషయంలో మనం మోసగింపబడ్డామూ యన్న సంగతికాని యోచించకుండా-మోసగింపబడినామని తెలిసికూడా చెవులు మూసికొని కూర్చొనటం మూర్ఖతకాకపోతే ఏమిటి? మనం మనుష్యజన్మ యెత్తినదెందుకు? ఇందుకొరకైతేకాదు. ధర్మ జిజ్ఞాస చేసేదే జన్మలో?

ఆవిధంగా- విచారించి తెలుసుకొనమని మరల ఆర్య సమాజం హెచ్చరించుచున్నది. ఆర్యసమాజం మనల ధార్మిక బానిసత్వం నుండి విముక్తుల గావించింది. ధర్మాధికారులమని చెప్పేవారంతా మన బుద్ధికి తగిలించిన తాళాలు బ్రద్దలుకొట్టి దయానందస్వామి దానిని స్వతంత్రం గావించెను. సత్యము- సనాతనం అనశ్వరమైన ధర్మాన్ని గురించి మనం విచారించుకొందాం.

ధర్మవిషయం ఎక్కడ విచారించాలి? అక్షయరత్న భాండాగారమైన వేదమును మనఅలసతవల్ల ప్రమాదంవల్ల దృష్టిపథంనుండి పోయింది. స్వార్థపరులైన గురువులు తమకు తెలిసిన కొద్దివిద్యే సర్వమని ప్రజల మోసగించుతూవచ్చారు. ప్రతివాడు పుల్లపెరుగును తియ్యదనిచెప్పి మోసగించబోవు నొ

ల్లవాళ్ళలాగ జనుల మోసగించుచుతూవచ్చారు. కాని పరమాత్మ యొక్క అపారకృపవల్ల స్వామి దయానందసరస్వతి జన్మించెను. ఆయన మూలనున్న అక్షయభాండాగారాన్ని నలుగురి ముందటపెట్టెను. అట్టి పరిస్థితులలోకూడ మనం మనమూఢనమ్మకాల వదలిపెట్టి అమూల్యరత్నరాసియగు వేదంవల్ల లాభం పొందక పోతే మనకంటే అభాగ్యులు మూర్ఖులు యింకెవ్వరుండబోరు.

## ౬

### అన్నిధర్మాలుమంచివే - దేనినిఖండిచకూడదు.

అన్నిధర్మాలుమంచివే దేనినిఖండిచకూడదని చెప్పేవారుచాలామంది బయలుదేరినారు. అందులోముఖ్యంగా కాఫరులగొంతుకల నులుముటచే 'గాజీ' అనుబిరుదుదొరుకుతుందని తమ ధర్మావలంబకుల ప్రోత్సహించుచుందురో అట్టి కురాను వాలాలు, రామకృష్ణులగురించి సీతనుగురించి దుష్టముగా వ్రాయుటయేగాక వీధిమూలల నిలబడి ఉపన్యాసాల నిచ్చే క్రైస్తవులు తమభండారాల ఆర్యసమాజంవారు బయట పెట్టుతుంటే భరించలేక గాభరాపడి అన్నిధర్మాలు మంచివే దేనినిఖండించకూడదని చెప్పటం మొదలు పెట్టినారు. తమ ధర్మాన్ని అనుసరించేవారిని తప్ప మిగిలినవారినంతా దుర్భాషలాడుచు ద్వేషించుచు హిందూమతంలో ఉన్న చిన్న చిన్న మతాల వారంతాకూడా ఆర్యసమాజం యితరధర్మాల ఖండించుతుందని దానిని నిందించుతారు.

అన్ని ధర్మాలుమంచివే, దేనినిన్నీ ఖండించకూడదనే వారిమాటలు విచారిస్తే 'ధర్మం'అనేది ఒక్కటేకాదని, బహు సంఖ్యాకమైనదని, ఆర్యసమాజంధర్మాన్ని ఖండించుతుందనిన్ని వారియభిప్రాయం తేలుతుంది. వాస్తవానికి వారిఅభిప్రాయా లు రెండూకూడ పొరపాటులే. ఎందుకంటే యదార్థమైనఅర్థం లో "ధర్మం"అని చెప్పదగింది ఒక్కటే. ఆర్యసమాజం సత్య మైన ఆధర్మసిద్ధాంతాన్ని ఎన్నటికి ఖండించదు. తమ మతమే గొప్పది యితరమతాలన్ని చెడ్డవని చెప్పి భిన్నభిన్న మతవాదు లందరుకూడ 'సత్యధర్మం' విషయంలో ఏకాభిప్రా యులై ఉంటారు. ఆభిన్నభిన్న మతవాదులుచేరినసభలో ఎవ రైనా జిజ్ఞాసువు లేచి సత్యభాషణలో ధర్మముందా? లేకమిథ్యా భాషణలోనా?యని అడిగితే వారంతాకూడ ఐక్యకంఠముతో సత్యభాషణములోనేయని ప్రత్యుత్తరమిస్తారు. అట్లేవిద్యాభ్యా సమందు బ్రహ్మచర్యము పాలించుటలోను, పూర్ణయువ్వనమం దు వివాహముచేసికొనుట, సత్సాంగత్య పురుషార్థములం దు ధర్మముందని, అవిద్యగ్రహణము బ్రహ్మచర్యం పాలించక పోవుట, వ్యభిచార దుస్సాంగత్య ఆలస్య అసత్యములందు కప టమునందు పరహింస పరహానులు మున్నగువాటియందు అధర్మంగలదని అందరు ఒప్పుకొంటారు. కాని స్వార్థపరులై ఆ సత్యధర్మప్రచారానికి పూనుకోరు. తమ పాండిత్య ప్రకర్షను చూపిస్తు శిష్యమండలిని వృద్ధిచేసుకొని ధనార్జనగావించుతూ జీవితయాత్రసాగించటానికి స్వకపోల కల్పిత మతప్రచారంలో నిమగ్నులై ఉంటారు. క్రొత్త విషయం ఏదైనా చెప్పుకుంటే

తమ్ముని నడిగేవారుండరని వారిభయం. అందువల్లనే వామ మార్గులు తదితర మతస్థులందరు నరకానికి పోతారని, ముక్తిని కోరేవారంతా తమ శిష్యులై భగవతిని పూజించి మద్యమాంసాది అయిదు మకారముల సేవించుమని. రుద్ర యములాది అరువదినాలుగు తంత్రాల ఒప్పుకోవాలని చెప్ప తారు. శైవులు విభూతిరుద్రాక్షలు ధరించకుండా, లింగార్చన చేయకుండా ముక్తిదొరకదంటారు. మేము ధర్మాధర్మాల ఒప్పుకోము సాక్షాత్తుబ్రహ్మలమని యీజగత్తు అంతమిథ్య, జ్ఞానిశుద్ధచేతనుడు కాగోరుచో తాను జీవుడన్న మాట మరచి పోయి పరబ్రహ్మనని భావించితే నిత్యముక్తుడై పోతాడని వేదాంతులు పలుకుతారు. జినధర్మంతప్ప మిగిలినవన్ని దోష భూయిష్ఠాలు కృత్రిమములని జగత్కర్త, అనాదియగు ఈశ్వరు డెవ్వడులేడని జైనులు ఘోషిస్తారు.

క్రైస్తవులు మనుష్యులంతాపాపులు, ఆపాపంనుండి స్వ యంకృషివల్ల బయటపడలేరు, పరమేశ్వరుని ఏకైకపుత్రుడగు ఏసు మానవజాతి యంతటిపక్షాన ప్రాయశ్చిత్తానికై, తన ప్రాణం అర్పించి తనదయార్ద్ర హృదయాన్ని లోకానికివెల్లడిం చాడు, నీవు మామతములోచేరి ముక్తిపొందమంటారు. పర మేశ్వరుని, ఆతని దూతయగు మహమ్మదును పవిత్రమైన కురా నును అంగీకరించకపోతే ముక్తిదొరకదని, అట్లంగీకరించని వారు నరకలోకానికిపోతారని, కాఫిరులని, చంపదగినవారని

మౌల్వీసాహెబుగారు సెలవిస్తారు. ఊర్ధ్వపుండ్రాలులేని ముఖం శ్మశాన సదృశమని, నామాలచూసి యమధర్మరాజు భయపడి పారిపోతాడని వైష్ణవోత్తములుసాయించుతారు. (నామాలచూసి చివరకి పోలీసు సిఫాహి, దొంగలుదోపిడగాండ్రుమున్నగుశత్రువులుగాని తుదకు నల్లులైనా భయపడనప్పుడు యమభటులు భయపడటంకల్ల) అదేవిధంగా కొందరు కబీరును, కొందరు నానకును, కొందరు దాదూను, కొందరువల్లభాచార్యుని, ఇంకాకొందరు సహజానందుని, మరికొందరు మాధవాచార్యుని అవతారపురుషులుగా చెప్పుతారు. ఇదంతా వినేటప్పటికి సత్యాన్వేషి దిగ్భ్రమ చెందుతాడు. ముక్తిమార్గం వివిధమతాలలో దేనిలోఉంది? లేకపోతే అన్నిటిని మించినదింకేదైనా మార్గమున్నదాయన్న ఆలోచనలో పడుతాడు. ఒక్కమతానికి విరుద్ధంగా వేయింటికి తొమ్మిదివందల తొంబైతొమ్మిది సాక్ష్యమిచ్చుటచే పైనచెప్పిన మతాలన్నీ దొంగమతాలక్రింద రుజువగును. అందరు ఒప్పుకొన్నట్టి పైనచెప్పబడినట్టి సత్యం, అహింస, బ్రహ్మచర్యము, సత్సంగం పురుషార్థసత్యవ్యవహారాలే సత్యధర్మంక్రింద తేలగలవు అవియే వేదధర్మాన్ని ప్రతిపాదించును. దొంగధర్మాలు చెప్పేవారి వలలో చిక్కుకొనకుండా తప్పించి ఆర్యసమాజము మనుష్యుల వేదాలు ప్రతిపాదించే ధర్మమార్గానుగాములు కావలసిందని బోధించుతుంది.

ఇక ఖండన మండనముల మాట మిగిలింది. ఆర్యసమాజం సత్యాన్నిగాని ధర్మాన్నిగాని ఖండించదు. అయితే దేనిని ఖండించుతుంది? ధర్మం పేరునజరుగు అసత్య అధర్మప్రచారాలను ఖండించుతుంది. అట్లుఖండించటం సత్యాన్ని ప్రేమించే సజ్జనులందరియొక్క కర్తవ్యం కూడాను. సత్యాన్ని సమర్థించుటకును అసత్యాన్ని ఖండించుటకును విద్వాంసులెప్పుడూ వెనుకాడకూడదు. ఖండనమండనముల ద్వారానే మనుష్యుడు సత్యాన్ని సాధించగలడు. సత్యముయొక్క గుణాలు తెలుసుకొని అసత్యంయొక్క దోషాలనెరిగి యే, మనుష్యుడు సత్యాన్నిగ్రహించి అసత్యాన్ని వదలి పెట్టగలడు. అన్యధా కాదు. ఖండన కార్యం వదలిపెట్టితే నీతి విద్యాధర్మజ్ఞానాల ప్రచారంసాగదు. ధర్మశాస్త్రిలు, అధర్మ అవినీతులను ఖండించకపోతే అందులోవుండేదేమిటి? బ్రహ్మహత్య, సురాపానము, చౌర్యము, గురుపత్నితో వ్యభిచారముగావించువారలు మహాపాతకులని అట్టిదుష్కర్మల గావించువారితో కలసి ఉండేవారుకూడ మహాపాతకులని ధర్మశాస్త్రిలలోకలదు. సురాపానం గావించువారలను మహానుభావుడగుమనువు ఎంతతీవ్రంగా ఖండించాడు? చోరులు, త్రాగుబోతులునలుగురిలోలేచి,చూడుడుమనువుఎంతమర్యాదహీనుడో ఎవరియిష్టంవచ్చినట్లు వారునడుచుకోకుండా, వారి చర్యల ఖండించుట ఎందుకనిఅంటే,విద్వాంసులుమనువు దేతప్పంటారా? మిడిలుపరీక్షలో నెగ్గిన ఒక గురువు తాను గొప్పగణితజ్ఞుడనని చెప్పుకొని ఒకబియ్యేచదివే విద్యార్థి తెచ్చిన ప్రశ్నకు తప్పు

అర్థం చెప్పితే అదిసరికాదని ఆవిద్యార్థికి గణితశాస్త్రముచెప్పే అసలుగురువు ఎం. ఏ. చదివినవాడు దానిని ఖండించుతే ఆతనిని దోషిఅంటారా? తల్లి మలినవస్త్రముల ధరించిన తన పుత్రుని నడవడిఖండించి శుభ్రముగా నుండుమనును, తండ్రికొమారుని అమర్యాదకరమైన నడవడినిఖండించి శిష్టాచరణమిట్లుండునని చెప్పును. గురువు తనశిష్యుని అజ్ఞానాన్నిఖండించి జ్ఞానోపదేశము గావించును. సూర్యుడు అంధకారాన్ని ఖండించి లోకాన్ని ప్రకాశవంతంజేయును. ఈవిధంగాఖండన ప్రతిరోజూ జరుగుతూనే ఉంటుంది. అట్లుఖండించువారిని చెడ్డవారని తిట్టకుండా లోకంవారికి కృతజ్ఞత చూపించుతుంది.

ఒకసారి ఒకక్రైస్తవ మతప్రచారకుడు, ఆర్యసమాజికులు గావించుపని వినాశకరమైనదని నాతో చెప్పెను. నే నాయనతో నార్యసమాజంయొక్క కార్యక్రమమంతా నిర్మాణకార్యక్రమమేయని జవాబుచెప్పినాను. ఆర్యసమాజం లోకాన్నంతా ఆర్యమయంగావించకోరుతుంది. ఇదియేదానియొక్క ముఖ్యోద్దేశం. ఇతరులను ఆర్యుల గావించగోరుట నిర్మాణకార్యక్రమమేకదా? ఆర్యసమాజం'వేదము'అనగాసత్యవిద్యను ప్రచారంగావించకోరుతుంది. ఇదికూడనిర్మాణ కార్యక్రమమేకదా? ౨౮౮ గురుకులమహావిద్యాలయములు,౩౦౦సంస్కృతపాఠశాలలు ౩౬కన్యాగురుకులలు,౧౦కాలేజీలు(కళాశాలలు)౨౦౦హైస్కూల్లు ౭౦౦కన్యాపాఠశాలలు, ౩౨౨హరిజనపాఠశాలలాదిగాగలసంస్థలకు ౨౦ లక్షలరూపాయిలకంటె అధికంగా ఖర్చుపెట్టి తన

నిర్మాణ కార్యక్రమముల ఆచరణ రూపంలో విద్యాప్రచారంగావించుచున్నది. దేశంలో గల ఆర్యసమాజికుల సంఖ్యనుబట్టిచూస్తే వారుగావించుచున్న పైవిద్యాప్రచారకార్యం, లోకంలో భూతభవిష్యద్వర్తమానాలలోఅద్వితీయమైనదని ఎల్లరు అంగీకరించవలసివస్తుంది. ౩౭౮ అనాథాలయాల, ౪౧౬ విధవాశ్రమముల, ౩౦ ముద్రాలయముల, ౫౦ పత్రికల, ౧౦౦ గ్రంథవిక్రయ ప్రకటనసంస్థల ఆర్యసమాజము తన నిర్మాణ కార్యక్రమం క్రింద లోకానికి చూపించగలదు. అయితే ఏదైనా భవనం కట్టదలచుకుంటే దాని పునాదులు లోతుగాత్రవ్వవలసి ఉంటుంది. పునాదులత్రవ్వటమాత్రం వినాశనకార్యమేకాని, మనకంతపెద్దదైనట్టి చిరస్థాయిగా ఉండగలిగిన భవనాన్ని కట్టదలచుకొంటే పునాదులులోతుగా త్రవ్వవలసిఉంటుంది.అస్థలంఒకసుందరసౌధరాజానికి తగినట్టుగా ఉండాలంటే అక్కడఉండే చెత్తచెదారమంతా తీసివేయవలసిఉంటుంది. పడిపోతున్న గోడలకు బొక్కలతో నిండిన నేలనుత్రవ్వి, నేలచదునుగాను గట్టిగాను చేయవలసి ఉంటుంది. అందువల్ల జీవితములో వినాశన కార్యక్రమం ముందు చేరకపోతే నిర్మాణకార్యక్రమానికి చోటుండజాలదు. నేనిదంతా చెప్పగాపాదరీగారుమీరుచెప్పినదంతాఅర్థమైంది కాని ఆర్యసమాజము నిర్మాణకార్యక్రమంకంటె ఎక్కువగావినాశన కార్యక్రమము సాగించుతుందని అన్నారు. అప్పుడు వారితో

నేనిట్లన్నాను, 1934 లో బీహారు భూకంపముతర్వాత ముంగేరు జిల్లాలో కొన్ని ఏండ్లవరకు అడ్డదిడ్డంగాపడ్డ వస్తువుల తీసివేయటంతోడనే సరిపోయింది. ఆపనిపూర్తి అయినపిమ్మట ఇండ్లుకట్టబడినవి. ఇప్పటిడీలోకములో వేదవిరోధులు, స్వార్థ మతవాదులు, ప్రబలిఉండుటచే ముందరవారి ప్రాబల్యం తగ్గించవలసిఉంది. కపటాన్ని, ఆడంబరాన్ని, మోసాన్ని ఖండించి వాటియొక్క నిజస్వరూపాన్ని ప్రజలకుచూపించుట చాలఅవసరము అట్లుచూపించిన తరువాత ప్రజలలోవాటియందువిముఖత ఏర్పడి, ధర్మజిజ్ఞాసలోకులహృదయాలలోనాటుకొనిపోయిన పిమ్మట సత్యముయొక్క యదార్థస్వరూపమువారికి చూపించబడును. అందుకనియే ఆర్యసమాజికులందరు అసత్యాన్ని ఖండించుతారు, సత్యప్రచారానికి అడ్డం తగిలేవారి కుత్సితకార్యాల నిరోధించుతారు. ఈవిధంగాస్థలాన్ని బాగుచేసుకొన్నమీదట నిర్మాణకార్యక్రమం ప్రారంభించుతారు. ఇదియే బుద్ధిమంతుని లక్షణము.

గాంధిమహాత్ముడు గురుతుల్యునిగాభావించునట్టి ఆధునికయుగంలో మహాత్ముడైన 'టాల్‌స్టాయి' యీక్రిందివిధంగా వ్రాసెను.

"ధర్మమువిషయంలో ఉన్నతప్పు అభిప్రాయాలఖండించి, వాటివల్ల కలుగు హానిని బట్టబయలుచేసి ధార్మిక సత్యముల పునరుద్ధరించుటవల్ల యీనాడు సంఘములోవ్యాపించియున్న చెడుగుల సంస్కరించుట సాధ్యమగును"

(విశ్వామిత్ర, మాసికపత్రిక జనవరి ౧౯33)

ఇప్పటికి ఖండనఅవసరమని తేలింది. కాని ఆఖండన ద్వేషపూరితముకాకూడదు. సత్యాన్ని ప్రచారముచేయాలనే ఉద్దేశంతో ప్రేరితమైనప్పటికైనంతవరకు కటుత్వంలేకుండా ఉండవలెను. అయితే "హితం మనోహారిచదుర్లభంవచః" అనగా హితకరమైనట్టి మనోహరమైనట్టివచనముండుటదుర్లభమనిఎవరో కవిచెప్పినాడు. చాలావరకు అదినిజముకూడా. అటువంటి అవస్థలో మనువు యీక్రిందివిధంగావ్రాసెను.

"ప్రియంచనానృతంబ్రూయాదేషధర్మస్సనాతనః"

అనగా ఎవరినైనా ప్రసన్నులగావించుకొనుట కొరకు అబద్ధమైన మాటలు చెప్పకూడదు. ఇదిసనాతనధర్మము.

౭

## మేము ఆర్యసమాజకులకంటే ముందడుగు వేశాం

సంఘసంస్కార విషయంతో చర్చలు జరుగుతుండే యీరోజులలో ఆర్యసమాజంకంటేకూడ తాము ముందడుగు వేశామని చెప్పుకొనేవారు చాలమంది కనబడుతూఉంటారు. ఇక్కడ మేము ఆర్యసమాజినిమించి ఎవ్వరూకూడ తన లేక లోకముయొక్క కల్యాణం సాధించజాలడని నిర్ధారణచేయుటానికి ప్రయత్నంచేసెదము. ఆర్యసమాజం ఏదేనివ్యక్తి ఆధిపత్యము తెలుపు విషయం ప్రచారంచేయదు. అది "యతోఽభ్యుదయనిశ్శ్రేయసః సిద్ధిః సధర్మః" అనగా దేనివల్లప్రాపంచిక

సౌఖ్యాలు లభించుటమే కాకుండా మోక్షంకూడా ప్రాప్తించు తుదో దానినినే ధర్మమని ఒప్పుకుంటుంది. మనుష్యమాత్రులి కల్యాణముకొరకు పరమాత్ముడు వేదాలలో నేదిడుపదేశించెనో దానిని ప్రచారం చేస్తుంది. వేదాలు పరమాత్మయొక్క జ్ఞాన భాండాగారము లగుటవల్ల నిర్భ్రాంతములు, స్వతఃప్రమాణ ములు. మనుష్యుడు విశ్లేషించి ఎంతజ్ఞానవంతుడైనను నిర్భ్రాం తుడు కాజాలడు అందుకనియే శ్రీకృష్ణభగవానులు,

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ"

అర్థం. కార్యాకార్యములు తెల్సుకొనుటలో శాస్త్రమే ప్రమాణం. అని సెలవిచ్చెను. శాస్త్రవిధులవదలి యిష్టం వచ్చినట్లు చేయుపురుషుడు నింద్యుడు. గీతాశబ్దాలలో వాని యొక్క కార్యములు అసురకార్యములు.

ఆకారణంవల్లనే దయానందఋషి ఆర్యసమాజానికి వేదాలనే ప్రమాణములుగ చేసెను. వాస్తవానికి (ఆర్య) జాతి తనపూర్వోన్నత్యం పొందునట్లుచేయగల్గిన రత్నాలెన్నో వేదములలో గలవు. సత్యశోధకుడగు మన మిత్రుడు ఆర్యస మాజం వేదములను ప్రమాణంగా అంగీకరించుటవల్ల సంకు చితమైనదని తాను దానికంటె ముందంజవేసినానని చెప్పుకుం టాడు. అతను స్వయంగా వేదముల చదువలేదు. క్రైస్తవ విద్వాంసులు తమ అజ్ఞానమువల్లనో, పక్షపాతంతో డగావించిన ఆక్షేపణల నంగీకరించి వేదములు అపౌరుషేయములగు జ్ఞాన

రాసులని అంగీకరించదు. కాని ఆర్యసమాజం ఆ వేదముల దయానంద ఋషివంటి అఖండ సంస్కృత పండితులమీద ఆధారపడి అపౌరుషేయములని ఒప్పుకొనుచున్నది. సంకు చితమనే మాటనే లేకుండజేయుటకు పూనుకొనిన మహాతప స్వి దయానందఋషి సంకుచితాభిప్రాయములు గలవాడా! ఒక్క దయానందుడే వేదములు అపౌరుషేయములని చెప్పితే అట్లు తీసివేయ వచ్చునేమో! కాని అనాదినుండి, కపిలు డు, కణాదుడు, గౌతముడు, జైమిని, పతంజలి, వ్యాసుడు, వాల్మీకి, మనువు, రాముడు, కృష్ణుడు మొదలుకొని ఉపనిష త్కారులంతాకూడా యీవిషయములో ఏకమతస్థులైనప్పుడు మేము పాశ్చాత్యశిక్ష బడసిన యీమిత్రులమాట నెట్లు విశ్వసించగలము?

ఆర్యసమాజము రూపాయికి పదహారు అణాలు వేద ములు సత్యములని చెప్పుతుంది.

ఆర్య సంఘములో స్పృశ్యా స్పృశ్యతయనే భూతం చాలా అల్లకల్లోలం చేస్తున్నది. బ్రాహ్మణుడుగా పుట్టిన వాడు రాజపుత్రుడుకాని, కాయస్థుడుగాని వండిన అన్నము తినడు. సారస్వత బ్రాహ్మణుడు కన్యాకుబ్జ బ్రాహ్మణునిచేతి అన్నం తినడు, మైథిలీబ్రాహ్మణులలో గల శ్రోత్రియబ్రాహ్మ ణులు యితర బ్రాహ్మణులు వండిన అన్నం ముట్టరు. ఇది అత్యాచారము. ఆర్యసమాజం,

"సమానీ ప్రపా సహావో అన్నభాగః"

అంటే మాఅందరికి భోజనాలయం ఒక్కటిగానే ఉండాలని "సహ భక్షాః స్యామ అనగా_ కలిసి తినవలసిందని వేదములు ఆదేశించుచునని తెల్పును. అటువంటప్పుడు ఇన్ని పొయిలెందుకు? ఇన్ని వేరువేరు భోజనశాలలెందుకు? ఆరోగ్య చితమైన ఆచరణగల్గి మద్యమాంసములు ముట్టక శుభ్రతను పవిత్రతను, దృష్టియందుంచుకొని ఎవరైనా భోజనము తయారుచేసినచో దానిని తినుటలో దోషమేమిలేదు. కాని వట్టి ఛాందసుడైన హిందూయువకుడేమంటాడు? మేము ఆర్యసమాజికులకంటెకూడ ముందడుగు వేశామని అంటాడు.

అయితే ఆర్యసమాజంకూడ అందరూకలిసి ఒక పళ్లెంలోనే తినాలని ఒకరిఎంగిలి ఇంకొకరు తినాలనిగాని చెప్పదు. అట్టి చర్య నిషిద్ధమే కాకుండా ఆరోగ్యానికి హానికరం. మనువు— "నోచ్ఛిష్టం కస్యచిద్దద్యాత్" ఎంగిలి ఎవరూ కూడా యింకెవరికీ యియ్యకూడదని శాసించెను. విజ్ఞాన శాస్త్రాల కాకరమైనట్టి నాగరికులైనట్టి జాతుల చరిత్రగూడ పరిశీలించండి. యాత్రకుపోవునప్పుడు అమెరికా వాసులు మంచినీళ్ళు త్రాగుటకు గ్లాసులు వెంటకొనిపోదురని ఒకరి గ్లాసు సింకొకరు ఉపయోగించరని స్వామి సత్యదేవు పరివ్రాజకులవారివల్ల నేను తెలుసుకున్నాను. వేదములు కాయకిష్టమునకు గౌరవస్థానమొసంగినవి, దురదృష్టవశాత్తు నేటి ఆర్యజాతి దాని మహాత్మ్యమును గుర్తెరుంగక అధఃపతితమైపోయి

నది. ఆర్య దేశంలోని జనులలో మూడవవంతు అనగా 2 కోట్లు అస్పృశ్యులై పోయిరి. ఆర్యసంఘం దుర్బలమై పోయింది.

వీరు కాయకష్టం చేస్తారు, ధర్మయుక్తమైన పురుషార్థం వల్ల వీరు తమతిండిని తాము గౌరవంగా సంపాదించుకొనుచున్నారు. అట్టి వీరిని ఘృణాభావంతో చూడక మన లోవారిగ తీసుకొమ్మని ఆర్యసమాజం బోధించుతుంది. ఆర్య సమాజం బోధించినట్లు హిందూసంఘ మనోవృత్తి మారి పోతే లోకకల్యాణం చేకూరినట్లే. కాయకష్టంయొక్క మహాత్యాన్ని రష్యావారు పూర్తిగా గుర్తించినారు. వారు ఆర్య సమాజంకంటేకూడా మనమిత్రునివలె ముందడుగు వేశారు. ఫలితమేమైంది. నేడు రష్యానాయకులు కంగారు పడుతున్నారు. ఎందుకంటే అక్కడి యువకుల స్థితి పూర్తిగా మారిపోయింది. పాఠశాలలో ఉపాధ్యాయపదవి ఖాళీవస్తే దానికొరకు దరఖాస్తుపెట్టువారు లేకుండా పోవుచున్నారు. మనుష్యులు కాయకష్టంతప్ప యింకొకటి చేయటం అగౌరవం గా భావించుచున్నారు. విద్యాబోధన మున్నగు పనులు అవమానకరములుగా ఎంచుతున్నారు. అట్టిపరిస్థితులు ప్రబలినచో విద్యా జ్ఞాన నాగరికతలు నశించి రష్యా సర్వనాశనమై పోదా? ఇటువంటి దృష్టాంతములెన్నియో చూపించవచ్చును. ప్రార్థన ఏమంటె ఆర్యసమాజ సిద్ధాంతాలనే రూపాయకు పదహారుఅణాలు ఒప్పుకోండి. మీరు ఆర్యసమాజికులకంటె

వెనకబడకపోతే చాలు. దయయుంచి వారికంటె ముందంజ వేయవద్దు.

౮

ఆర్యసమాజంలోకూడా చాలాచెడుగులు ఉన్నవి.

ఆర్యసమాజికుడు మాటలు చెప్తాడని, చెప్పినట్లు చేయడని చాలమంది ప్రస్తుతంనిందారోపణగావించుతున్నారు. వానిలోకూడా చాలాచెడుగులున్నాయని అటువంటప్పుడు మేము ఆర్యసమాజంలో ఎందుకు చేరాలని అడుగుతున్నారు. ఎందరో వ్యక్తులు తాము ఆర్యసమాజకులమని చెప్పుకుంటారు కాని వాస్తవానికికారు. వారు ఆర్యసమాజాన్ని కళంకితము గావించుచున్నారు- తమ దురాచారములవల్ల తమ సంఘసాను భూతిని గోల్పోయిన వ్యక్తులెందరో తాము ఆర్యసమాజ కులమని చెప్పుకుంటున్నారు. ఒకడొకవిధవతో వ్యభిచరించి, ఆమెకు గర్భంవస్తే - నేనువిధవా వివాహము చేసుకున్నాను లేకనియోగం చేసుకొన్నాను. ఆర్యజమాజకుడనని చెప్పుకుం టాడు. ఇంకాకొందరు, విధవావివాహాన్ని ఒప్పుకొనుటవల్ల నేమి, అస్పృశ్యతకువిరుద్ధంగా మాట్లాడినందువల్లనేమి, పూర్వాచార పరాయణులు అట్టి వారిని ఆర్యసమాజకులని అంటారు. వారు వేదానుకూలంగా ప్రవర్తించనప్పటికి ఆర్యసమాజం తో వారికెట్టివిధమైన సంబంధం లేనప్పటికికూడ ఆర్యసమాజ కులని పిలుస్తున్నారు. పైనచెప్పిన వారందరి దురాచారాలను

ఆర్యసమాజం నెత్తినవుస్తుట న్యాయం కాదు. ఎంతవరకు వేదాలు ఆర్యసమాజానికి ఆధారముగానుండునో, ఆర్యసమాజ నియమాలలోనుసిద్ధాంతాలలోను ఆక్షేపణీయ హాంశములుఎంత వరకు ఉండవో అంతవరకు ఆర్యసమాజానికి వచ్చినభయమేమి లేదు. ఎవడో ఒకడు తాను ఈశ్వరుడనని చెప్పుకొన్నంత మాత్రాన అతనిలోనున్న అల్పజ్ఞత మున్నగుదోషాల మనము ఈశ్వరున కారోపించుట ఏమంతసమంజసమైన కార్యం? ఆర్య సమాజంలోగల సభ్యులలో అధికాంశం సదాచారులు త్యా గులు. మనుష్యుడన్నవాడిలో లోపాలుండకపోవు అందుకనే ఆర్యసమాజం మనుష్యుల నెవ్వరిని నిర్భ్రాంతులుగా అనగా దోషరహితులుగా అంగీకరించక వేదాలే శరణ్యమని ఉప దేశించును.

ఆర్యసమాజకులలో ఉన్న పొరపాట్లను మీరు అనుస రించకండి ఆర్యసమాజంయొక్క సిద్ధాంతాలలో దోషాలు లేన ప్పుడు, ఫలానివ్యక్తిలో ఫలానిదోషముంది కాబట్టినేను ఆర్య సమాజంలో చేరనని మొండిపట్టు పట్టుకొని సత్యసిద్ధాంతం వల్ల లాభంపొందకపోవుట ఏమంత తెలివైనపని.

ఇంకొకమాటఉంది. ఆర్యసమాజకులకు హిందువులంటే ఉన్నప్రేమవల్ల వారిని విడిచిపోగోరరు. హిందువులకు వేదాల మీద అచంచలమైనభక్తి ఉందని, అజ్ఞానంవల్ల వాటియదార్థ మైన అర్థం గ్రహించలేక వైదికసిద్ధాంతాలనుండి పరాఙ్ముఖు

లైపోతున్నారని ఆర్యసమాజకులకు తెలుసును. ఆసిద్ధాంతాల వారు బాగా అర్థంచేసుకున్నప్పుడు ఆర్యసమాజికుల కార్యకలాపంలో మీరు సదా చేదోడు వాదోడుగా ఉంటారని కూడా వారికి తెలుసును. అందుకనే మిమ్ములవదలి వారు వేరే మార్గం త్రొక్కగోరరు. మిమ్ములకూడా వెంటలాగుకొని పోగోరుతారు. దానివల్లనే జనాభా లెక్కలప్పుడు తాముకూడ హిందువులమనే చెప్పుకుంటారు. మీసంసర్గంవల్ల మీలోని దోషాలు కొన్ని వాళ్లలోకూడ ప్రవేశించినవను మాటచెప్పనక్కరలేదు. ఈ విషయాన్ని గురించి యింతకంటె వ్రాయనక్కరలేదు.

## ౬
## వైదికధర్మంలో గల విశేషత

ఇంతవరకు ఆర్యసమాజ ప్రచార సందర్భంలో ప్రజలకు తోచు ప్రశ్నలకన్నింటికి జవాబులీయబడెను. ఇప్పుడు వైదికధర్మంలో గల ప్రత్యేకమైన విశేషత నిరూపించబడును.

౧. క్రిందటి పేజీల చదువుటచే ఆర్యసమాజమే మొట్టమొదట మనయొక్క అసలుపేరు మనకు తెల్పినదనుసంగతి స్పష్టమగును. మనపేరు నిజానికి "హిందువు" కాదు. హిందూశబ్దంయొక్క అర్థం చాలా చెడ్డది. దానికి అర్థం— దొంగ, బానిస, నల్లవాడు, పాషండుడు మున్నగునవి. అది ఫారసీ భాషలోని శబ్దం. ముసల్మానులు ద్వేషంతో మనకీ పేరు పెట్టినారు. వేద, ఉపనిషత్తు, శాస్త్రస్మృతులయందెక్క

డా హిందూశబ్దం మన పేరుగా ఉపయోగింపబడలేదు. ఆర్య శబ్దమే ప్రయోగింపబడినది. ఆర్యశబ్దమునకు శ్రేష్ఠపురుషుడు, ఉన్నతశీలుడగు పురుషుడు మున్నగు అర్థములు కలవు. శ్రీ రామ కృష్ణులు మున్నగు వారందరు ఆర్యులే. హిందువులు కారు. రామాయణ మహాభారతాదులు చదువువారా సంగతి బాగా యెరుంగుదురు.

౨. వైదికధర్మంలో గల రెండవ విశేషత. అది మనల నిజమైన ధార్మికపురుషులుగను ధర్మమంటే ప్రేమగలవారిగను చేస్తుంది. నేడు ధర్మమంటే ప్రజలకు అసహ్యం పుట్టుచున్నది. ఎంతోమంది బుద్ధిమంతులుకూడ ధర్మం చెడ్డదని భావించుతున్నారు. ధర్మం ప్రజల ద్వేషపూరితులుగాను, అత్యాచారులుగాను చేస్తున్నది. మనుష్యులలో భేద భావము పుట్టించి ఒకరి నింకొకరి శత్రువుల గావించుచు మానవ సమాజమును నాశనముగావించుచున్నది. కళ్ళు తెరిచి మనం చూస్తే ధర్మంపేర జరగని కుకర్మయొక్కటైనా మనకు కనపడదు. ధర్మంపేర రక్తపాతాలు జరుగుచున్నవి. ధర్మంపేర నోరులేని జంతువులు బలిగావింపబడుచున్నవి. ధర్మంపేరులో పాషండత్వము, ఆడంబరము అన్యాయం మూర్ఖతలు దాగియున్నవి. ధర్మంపేర వ్యభిచారం, బాల్యవివాహములు, బహుభార్యాత్వం మోసం, ధూర్తత, సోదరుని సోదరుడు శత్రువుగా చూచుట, మున్నగునట్టి వెన్నియో ఘోరాలు జరుగుచున్నవి. ఆర్య సమాజంపైన చెప్పబడినకుకర్మములగావించువారంతా ధర్మా

త్రకళత్రములతో సుఖించవలెనని ఆర్యసమాజం చెప్పుతుంది. అయితే ఇంద్రియ సుఖాలలోనే మునిగి తేలవద్దని, వస్తువుల ననుభవించునప్పుడు వాటియందుమమతకలిగి ఉండవద్దని కూడా చెప్పుతుంది. ఆవస్తువులన్ని పరమాత్మవనియు, కేవలం అనుభవంకొరకే మనకియ్యబడినవని భావించమంటుంది. పరమాత్మ ఎప్పుడు ఆవస్తువుల తీసుకొనగోరునో ఆనందంతో మనం వాటిని యిచ్చివేయటానికి సంసిద్ధులమైఉండాలి. అట్టి స్థితిగలవారికి దుఃఖమనేది కలగనే కలగజాలదు.

౪. నాలుగవవిషయం ఆర్యసమాజం మనుష్యుని నిజమైనఆస్తికునిగాను ఈశ్వరభక్తిపరాయణునిగానుచేస్తుంది. సృష్టిలో మనుష్యుడు చాల అల్పసామర్థ్యంగల ప్రాణి అది గుర్తింపకుండా నేదొగొప్పవాడనని అభిమానంపడటంవల్ల నష్టంగాని లాభంలేదు. అట్టిమనుష్యుడు అడుగడుగునను దెబ్బలు తింటాడు. నాస్తికుడికి చుక్కానిసడిపేవాడు లేనినావగతిపట్టుతుంది.

ప్రపంచంలో తాము ఆస్తికులమని చెప్పుకొనేవారు చాలామందిఉన్నారు. కానివారిలో ఎక్కువమంది రాతిబొమ్మల పూజించుటలో మునిగి తేలుతూఉన్నారు. ఆర్యసమాజం ఈశ్వరుని స్థానంలోమనుష్యునింకెవ్వనిని పూజించతగదనును ఈశ్వరుడుఅలసిపోయి ఏయితరకారణాలవల్లనో,ఒక్కడినో, లేక పదిమందినో అసిస్టెంటులుగా పెట్టుకొని వారిద్వారాపని సాగిం

చేవాడిలాగ ఒప్పుకోదు. కొడుకుమీదకాని లేక యింకెవ్వరై నప్రత్యేక సలహాదారుమీదగాని ఆధారపడి ఉండేవాడిలాగ ఈశ్వరుని ఆర్యసమాజం అంగీకరించదు.

ఆర్యసమాజం ఈశ్వరుని సర్వవ్యాపిగా ఒప్పుకుంటుంది. ఏదేని ప్రత్యేక పట్టణంలోగాని మందిరంలోగాని ఉండేవాడని అంగీకరించదు. వైకుంఠములోగాని గోలోకంలోగాని, కైలానంలోగాని యింకెక్కడో ఆకాశంలోకూర్చుని ఉండేవాడిలాగ భావించక సర్వాంతర్యామిగా గ్రహించి ఎక్కడను ఎట్టికుకర్మలనుగాని కుచేష్టలగాని గావించవద్దని బోధించుతుంది.

౫. అయిదవ విశేషము. ప్రతివ్యక్తియు తనఉన్నతితో తృప్తిపడియుండక ఇతరుల ఉన్నతికై పాటుపడవలెనని ఆర్యసమాజం బోధించుతుంది. ఇతరులంటే తనచుట్టు ప్రక్కల ఉండువారేయని ఆర్యసమాజంభావించదు లోకకల్యాణముకొరకు పాటుపడుటయే ఆర్యసమాజం తన పరమధర్మంగా ఎంచుతుంది. ఆర్యసమాజం ఒకపరోపకారసంస్థ ఇందులో చేరివారు తమసంకుచితాభిప్రాయముల పోగొట్టుకొని లోకోపకారులు కావచ్చును.

౬. ఆరవ విషయము. ఆర్యసమాజం దయానందస్వామి సిద్ధాంతాన్నేదో ఒకదానిని పట్టుకొని వ్రేలాడదు. వేదప్రచారమును కోరును, చేయును. వేదములు ప్రపంచంలోని అన్ని గ్రంథములకంటె ప్రాచీనములనియు, అనంతవిజ్ఞాననిధులనియు ఈశ్వరోక్తములనియు జ్ఞానరాశులనియు, ఉపనిషత్కారులు, మనువు,కపిలుడు కణాదుడు గౌతముడు వ్యాసుడు పతంజలి రామకృష్ణాదులు మున్నగు ఋషులు మహర్షులు మహాపురుషులు సృష్ట్యాదినుండి ఒప్పుకొనుచునేయున్నారు.

౭. ఏడవ విశేషము. ఆర్యసమాజం ధర్మం సంబంధ విషయములో బుద్ధినుపయోగించవలెనని బోధించును, ప్రపంచములోగల మతములన్నియు, ధర్మంవిషయంలో తర్కించువానిని నాస్తికుడని, ధర్మద్రోహి, కాఫిరు మున్నగు చెడ్డపేరులతో పిలచును- ధర్మంవిషయంలో గ్రుడ్డినమ్మకం ఉండాలని ఆమతముల సిద్ధాంతం వారిధర్మగ్రంథాలు, ఆచార్యులు చెప్పిటచే నేదేని విషయాన్ని ఆమతాలవారు ధర్మంగా భావిస్తారు. దీనికి విరుద్ధంగా ఆర్యసమాజం మనువుయొక్క-

"యస్తర్కేణాను సంధత్తే సధర్మం వేద నేతరః"

తర్కం ఉపయోగించి ఎవ్వడు శోధించునో వాడేధర్మా

న్నిగ్రహించగలడు. అన్యుడుగ్రహించజాలడు-అనేసిద్ధాంతాన్ని ఒప్పుకొనేది-

ఈ కారణాలన్నింటివల్ల మనక్షేమంకొరకు, లోకకల్యాణంకొరకు గ్రుడ్డినమ్మకం మున్నగు వికారాలనుండి తప్పించుకొనుటకు, మనం ఆర్యసమాజంలోచేరాలి, లోకాన్నంతా ఆర్యమయం చేయాలి.





"ఓం ఆబ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మ వర్చసీజా
యతాం మా రాష్ట్రే రాజన్యః శూరఇషవ్యో౽-
తి వ్యాధీమహారథో జాయతాం । దోగ్ధ్రీధేనుర్వో
ఢానడ్వానాశుః సప్తిః పురంధిర్యోషాజిష్ణూరథే
ష్ఠా. సభేయోయువాస్య యజమానస్యవీరోజా
యతాంనికామె నికామే నః పర్జన్యోవర్షతు ఫల
వత్యోన ఓషధయః పచ్యన్తాం యోగక్షేమోనః
కల్పతాం । యజు ౨౨ । ౨౨

# మనోరథము

కరుణ చిల్కెడు నీ దృష్టి కతముగాఁ గ
తులను ధనధాన్యముల సరితూపఁ బడుచు
దేశ జనులెల్ల రానంద ధీరులగుచుఁ
దిరుగఁ జేయుము తిరముగ దీనబంధు! ౧.

బ్రహ్మతేజులు నాత్మాభిమాన ధనులు
బ్రాహ్మణులు వేద, భాష్య సంభావనముల
వరలుదురు గాత, వారిభావముల నెపుడు
లోక హితమొల్కఁ జేయుమో లోకమూర్తి! ౨.

రాజ్యపీఠాలనుండెడి రాజులెల్ల
విక్రమాఢ్యులు శూరులు వీరులగుచు
దుష్ట జాతుల కడలేని త్రుళ్ళడంచు
రాజులేగాని, వారు తరాజులనఁగఁ
జేయకుము వారి నీవు జేజేల ఱేఁడ! ౩.

పాలపొదుగుల చేపులు పరుగులిడఁగ
నాత్రముగ లేగలంగాంచు నాశతోడి
గమనవేగమ్ము పెంధూళి గ్రమ్మజేయ
ఆవు లిండ్లకు నరుగుత ఆదరమున! ౪.

వారువమ్ములు సప్తాశ్వ వారువముల
గమనవేగము 'నిహి'యనఁ గలుగుఁగాక!
పాలు విడిచిన కోడెలు పాటుపడుచు
కర్షకుల కిచ్చుఁగాత! బంగారుపంట. ౫.

పడుచువారల బిరుసు దంబములుపోయి
వినయ సభ్యత్వవాసనల్ వెలయుఁగాత!
వ్యసనచయమెల్ల రూపఱి భస్మమగుత
యువకులెల్లరు విద్యాభియుక్తులగుత! ౬.

ఆర్యవర్యుల యింటింట నగ్నులెపుడు
హవ్య భోజన సంతృప్తి నలరుఁగాత!
స్త్రీ పురుషులెల్ల రానంద రూపులగుచు
శాంతి సుఖమయధామ విశ్రాంతులగుత! ౭.

కురియుఁగావుత సస్యానుకూలవృష్టి
వలయు వేళల జీమూత పటలి కెరలి,
దాన నుర్వర జలఫలోదాత్తయగుచు
మనుచుఁ గావుత మమత నీ మనుజతతిని. ౮.

'దుఃఖ' శబ్దమ్ము దూరమై తూలు గాక!
'దైన్య' పదమది దుష్టుల సైన్యమగుత!
స్వీయ దేశపు శౌర్యాగ్నిశిఖలఁ గ్రాఁగి
వైరివర్గము భీరులై పరుగులిడుత! ౯.

రేయిఁ బవలును మాయంతరింద్రియములు
ఇందులకె మొఱలెత్తునో యీశ! వినవె?
ఇంకనైనను ప్రోతలాలించి మాకు
సకలమహి శాంతి గూర్పవా? సత్యరూప! ౧౦.

కవి:- కందాళ వెంకట నరసింహాచార్యులు గారు.